వేదాంగాదిపురాణముఖ్యవిలస♦ ద్వేద్యాగమప్రక్రియా
వేది న్నిన్ను భజింతు నెమ్మనమునన్ ♦ విశ్వేశ భీమేశ్వరా. ౧౩౬

కం. కామేశ్వరు నీశ్వరునిం, గామితఫలదానకల్ప♦కముఁ గామరిపున్
గామాతీతుని దేవ, గ్రామణి నిను నాశ్రయింతు ♦ గౌరీరమణా. ౧౩౭

కం. ఆనందజ్యోతినిఁ బర, మానందానందమూర్తి ♦ నవ్యయునిఁ ద్రిలో
కానందామృతదాయి మ,హానందుని వృషభవాహు ♦ నభివర్ణింతున్. ౧౩౮

సీ. ఓమహాలింగంబ♦ యోమహాదేవుండ, యోమహాత్ముఁడ దేవ♦ యోమహేశ
యోమహాసంపత్ప్ర♦ యోగదీక్షాదక్ష, యోమహాపాపేంధ ♦ నౌఘదహన
నీమూర్తిసంస్మృతి ♦ నీనామసంస్మృతి, నీకథాశ్రవణంబు ♦ నిఖిలదురిత
యూథాంధకారసూ♦ర్యోదయం బఖిలక,ల్యాణనికాయసం♦ప్రాప్తిహేతు

తే. వంబికాకుచకుంభద్వ♦యాంగరాగ, పరిమళాసారవాసిత ♦ బాహుమధ్య
దక్షిణాపథకాశకాం♦తర్విహార, గిరిశ శ్రీభీమనాథ ర♦క్షింపు మమ్ము. ౧౩౯

వ. అని సప్తఋషులు సంస్తుతించిరి తదనంతరంబ యరుంధతీదేవియు హంసవాహన
పశుసఖిచండికాపరిచారికాసముదయంబును ననేకప్రకారంబులఁ బ్రశంసించి
యథాశక్తిం బూజించిరి. ౧౪౦

కం. ఈ సప్తమునిస్తోత్రము, వ్రాసినఁ జదివినను వినిన ♦ వర్ణించినఁ గై
లాసపతి దక్షవాటిని, వాసుఁడు జనులకు నభీష్ట♦వరము లొసఁగున్. ౧౪౧

వ. అనిన విని మంకణుండు మునీంద్రా సదాశివభక్తిమాహాత్మ్యం బింకను నాకెఱింగిం
పవే యని యడుగుటయు వసిష్ఠమునీంద్రుం డిట్లనియె. ౧౪౨

గీ. కల్పవృక్షం బదేటికిఁ ♦ గామధేను, సముదయం బేల యిష్టార్థ♦సంపదలకు
నిశ్చయంబుగ మనసులో ♦ నిల్చెనేని, చాలదా మర్త్యు రక్షింప ♦ శంభుభక్తి. ౧౪౩

గీ. శంభుపదభక్తులకు వినా♦శంబు లేదు, కదియ వీశానుభక్తులఁ ♦ గల్మషములు
నాదియందుఁ బ్రతిజ్ఞగా♦నానతిచ్చెఁ, జంద్రచూడుండు నిజభక్త♦జనముఁగూర్చి.

సీ. భోగీంద్రభూషణు ♦ భూతిదిగ్ధాంగుని, నాభీలశూలాయు ♦ధాగ్రహస్తుఁ
గాకోలవిషనీల♦కంధరాభాగుని, గజచర్మపరిధాన ♦ కటివిభాగుఁ
దాండవాడంబరో♦ద్దండదివ్యాకారు, నజవిష్ణువిబుధాధి ♦ పాభివంద్యు
గంగాతరంగసం ♦ కలితోత్తమాంగునిఁ, ద్రైలోక్యరక్షా ప్ర♦దానదక్షు

తే. నీకు సాకారునొండె నొం♦డేవిభూతి, ఫతినిరాకారుఁగాఁజూచి♦బహువిధములఁ
బూజసేయంగ నేర్చిన ♦ పుణ్యమతులు, వారు శివభక్తులందు రి♦వ్వసుధలోన.

కం. శివధనము ముచ్చిలించిన, శివధన మన్యాయవృత్తిఁ ♦ జెడిపోవంగాఁ
దవులక యుపేక్షచేసిన, శివభక్తి ద్రోహమంద్రు ♦ శివభక్తివిదుల్. ౧౪౬

గీ. శివునికై భిక్షచేసి యార్జించినట్టి ద్రవ్య మావంతయేనియుఁ దా స్పృశింప
కభవునకు నెవ్వఁడొసఁగు నర్పణంబు, వాఁడు శివభక్తముఖ్యుండు వసుధలోన.

కం. మాటలు వేయును నేటికి, హాటకధాన్యాదిశివప దార్థముల యెడం
జేటునకోర్వమి తుదిఁ బరి, పాటించినశంభుభక్తిపథము మునీంద్రా. ౧౪౮

సీ. మహనీయసంప్రీతి నుద్భక్తజనముల, నాదరించుచునుండు నతఁ డొకండు
ఫలములుఁ బక్వాన్నములు మాకు నర్పింప, కనుభవింపక యుండు నతఁ డొకండు
పంచాక్షరీమంత్రపాఠంబు నిత్యంబు, నాచరించుచునుండు నతఁ డొకండు
ననుఁ బ్రస్తుతించునాపురాణంబులు, సతత మావర్తించు నతఁ డొకండు

తే. శిలలఁ గాష్ఠంబులను మృత్తికలను నిసుక
లింగముల లెస్సగాఁగఁ గల్పించి భక్తి
నర్చనము సేయునతఁ డొకం డనుచుఁ జెప్పు
శివుఁడు భక్తవిమర్శనచేయునపుడు. ౧౪౯

వ. అదియునుంగాక రాగద్వేషఝషసంకులంబును గామక్రోధలోభమోహమదమాత్సర్యమహాగ్రాహాకులంబును బుణ్యపాపతోయమహాప్రవాహంబును నైన యీ సంసారమహాంభోరాశియందుఁ గర్మచోదితము లైనజంతువులు మునుంగుచుఁ దేలుచుం గొంతతడవు సుఖంబును గొంతతడవు దుఃఖంబును ననుభవించుచునుండును. కలియుగంబున శివభక్తి యుత్పన్నంబై యుండు. ౧౫౦

గీ. అతివిశుద్ధాత్మ! చతురంఘ్రిఁ గృతయుగమునఁ
ద్రేతఁ బాదత్రయమున వర్తించుచుండి
ద్వాపరంబునయందుఁ బాదముల రెంట
వెలయు శివభక్తి యొకకాలఁ గలియుగమున. ౧౫౧

గీ. కలియుగంబున ధర్మంబు కఱవుగాన, నందు ధర్మంబుఁ జేసిన యతఁడు ఘనుఁడు
నిండు వేసవి మరుభూమి నిర్మలముగఁ, జేర్చి సలిలాన్నసత్త్రంబుఁ బెట్టినట్లు. ౧౫౨

వ. అని మఱియు నొకప్రశ్నంబు చెప్పెదఁ బూర్వకాలంబున. ౧౫౩

గీ. అభవు నొకనాఁడు ప్రార్థించి యడిగె గౌరి, కలియుగంబున శివభక్తి గ్రాఁగిపోవు
నఖిలలోకహితంబుగా నానతిమ్ము, భక్తివిజ్ఞానయోగంబు ఫాలనయన. ౧౫౪

వ. అని భవాని విన్నవించిన మహేశ్వరుండు. ౧౫౫

గౌరికి మహేశ్వరుండు భక్తివిజ్ఞానయోగంబుఁ జెప్పుట.

గీ. అడుగవలసినయర్థంబ యడిగితీవు, క్రాఁగియుండెడు శివభక్తి కలియుగమునఁ
బాపకర్ముఁడు కాని యొప్పాటలేఁడు, పుణ్యకర్ముఁడు వికసితాంభోజనయన. ౧౫౬

సీ. ఎప్పుడు కలియుగం • బేతెంచుఁ గ్రమవృత్తి, బాపంబులన్నియుఁ • బ్రబలుచుండుఁ
బాపంబు లోకభంగిఁ • బ్రక్షయంబొందిన, నామీఁద దృఢభక్తి • నాటుకొనును
నామీఁద దృఢభక్తి • నాటుకొన్నప్పుడు, ధర్మంబు వర్తించుఁ • దరతరంబు
ధర్మంబు వృద్ధిఁబొం • దఁగఁ జిత్తమునఁబట్టు, లింగార్చనావిధి • మంగళంబు
గీ. అంతట విభూతి యలఁదంగ • నానపుట్టు, నంతమీఁనటఁ గల్గు రు • ద్రాక్షకలన
పాశుపతమటమీఁదను • బదిలపడును, ముక్తిలతికకు నదిగదా • మూలదుంప. ౧౫౭

వ. మఱియు నొక్కటిచెప్పెద సదాచారనిరతులైనబ్రహ్మక్షత్రియవైశ్యులును ద్రైవర్ణ్య
శుశ్రూషాపరులై సత్యవాదులైనశూద్రులును బతివ్రతలైనపుణ్యస్త్రీలును నాత్మ
దర్శనంబునకు నధికారులు విశేషించి. ౧౫౮

గీ. రాగవైషమ్యములులేక • ప్రజ్ఞగలిగి, మనములోన విరక్తి యె • వ్వనికిఁగలుగు
వాఁడె యధికారి బ్రహ్మకై • వల్యమునకు, వీఁడువాఁడని కులశుద్ధి • వెదుకవలదు.

సీ. బహుజన్మసంశుద్ధి • భాగ్యసంపఁగాని, యోగవిద్యాశక్తి • నూన దాత్మ
యోగసామగ్రికి • నుచితసాధనములు, వాయుమార్గవిశుద్ధ • వర్తనములు
నాడిపరంపరా • క్రోడవాయుజయంబు, బలము చేతస్థితి • భాగ్యమునకుఁ
జిత్తంబు తనయాజ్ఞ • చేసివర్తించెనే, నిట్ట ట్టనఁగఁజాల • వింద్రియములు

గీ. యమనియమములునాసన • ప్రాణనియతి
ధ్యానమునుధారణంబుఁ బ్ర • త్యాహృతంబు
ననసమాధియునాఁగ న • ష్టాంగకలన ౧౬౦
బ్రహ్మయోగంబు విలసిల్లుఁ • బద్మనేత్ర.

గీ. దేవి! సద్గురునాథోప • దిష్టసరణి, మనుజుఁ డష్టాంగయోగంబు • ననువుపఱిచి
యంతనద్వైతభక్తిఁగృ • తార్థుఁడగుచు, నన్నుఁగని ఘోరభవబంధ • నంబుఁబాయు.
యోగంబున నన్ను నాత్మం

వ. రజ్జుజ్ఞానంబున సర్పభ్రాంతి నివృత్తి యగుచందంబున
గను కారణంబున నవిద్యానివృత్తియగు ననినఁ గృతాంజలియై త్రిపురహర! యో ౧౬౧
గంబెయ్యది? బ్రహ్మజ్ఞానంబెయ్యది? యానతీవేయనుటయు.

గీ. శమము దమము తపంబును • శ్రద్ధతాల్మి
యుపరతి సమాధానమనఁగ ని • ర్మలవివేక
సాధనములారు దెరువులు • సంఘటిల్లు ౧౬౩
మోక్షమునకంద్రు నిగమార్థ • మూలవిదులు.
ప్ర • త్యాహరణము

గీ. బలిమిమైనింద్రియంబులఁ • బట్టితెచ్చు, నదినుమీయిందువదన
నిదియనూవె. ౧౬౪
సర్వసంసారదుఃఖప్ర • శాంతిహేతు, వేకచిత్తప్రకారంబు • నిదియనూవె. ౧౬౫

వ. ధ్యానంబు సాకారనిరాకారంబులు నూవె.

గీ. నిర్గుణుని నిత్యశుద్ధుని ♦ నిర్వికారు, నాత్మఁ గనుట నిరాకార♦మనఁగఁబరఁగు
శేషనదిచంద్రరేఖాది ♦ చిహ్నధారి, ననుఁదలంచుట సాకార♦మనఁగ వెలయు.
కం. గురుఁడే యభవుఁ డభవుఁడే, గురుఁడని యభవునకు గురున♦కును భేదమెదం
బరికింపనిశిష్యున కే, గురుఁడ నభవుఁడనయి వాని♦కోర్కులు దీర్తున్. ౧౬౭
గీ. రాజసముమానిశిష్యుండు ♦ ప్రకటభక్తి
గురునిఁ గొలువంగఁదగురాజుఁ♦గొలిచినట్లు
వినయమొప్పంగ నిశ్శోక♦వృత్తిసౌఖ్య
నిభృతుఁడందుఁ ద్రివర్గంబు ♦ నీరజాక్షి. ౧౬౮
గీ. సర్వభూతములందును ♦ సమతఁబూని, సత్త్వనిధుఁడయి యెవ్వాఁడు♦సంచరించు
నతఁడు శివభక్తుఁ డాతని ♦ నాదరింతు, నెట్టివేళలయందుఁ బూ♦ర్ణేందువదన.
సీ. పాపంబుపుణ్యంబు ♦ పాథఃప్రపూరంబు, దుర్వారమైనట్టి ♦ దుఃఖ మడుసు
కాంతాదిసుఖము పై♦కత వేదికాస్థలి, కందర్పవికృతులు ♦ కరడములును
బ్రాణభయంబు న♦క్రకులీరనివహముల్, చేతోవికారముల్ ♦ క్షితిధరములు
బహుళదారిద్ర్యంబు ♦ బడబాగ్నిపిండబు, విషయాభిలాషంబు ♦ విషముగాఁగ
గీ. ననుధికం బైనసంసార♦జలధియందు, మునుఁగుచును దేలుచును గడ♦ముట్టఁబడని
జనులకెల్లను మత్పాద♦సరసిజములు, తెప్ప యైయుద్ధరించు నిం♦దీవరాక్షి. ౧౭౦
కం. కామక్రోధావేశ, వ్యామోహాదుల నిజాన్వ♦యాచారంబుల్
వైముఖ్యమునొందించుచుఁ, బామరసంసారజలధిఁ ♦ బడుదురు కుమతుల్. ౧౭౧
కం. సుఖముల దుఃఖంబులుగా, సుఖములుగా దుఃఖములను ♦ జూతురు కుమతుల్
సుఖదుఃఖసమతఁ జూచిన, నఖిలభవాంభోధిఁ గడుతు ♦ రంబుజవదనా. ౧౭౨
సీ. మనసుఁ గామక్రోధ♦మదలోభముల కిచ్చి, సడలింతు రన్వయా♦చారసరణి
నన్వయాచారంబు ♦ లట్లుమాసి చనంగ, వర్తింతు రన్యాయ♦వర్తనమున
నన్యాయవర్తనం ♦ బదికారణముగాఁగఁ, బడిమునుంగుదు రుగ్ర♦భవపయోధి
భవపయోనిధిలోనఁ ♦ బడియుండి కాంతురు, నరకకూపమున ను♦న్మజ్జనంబు
గీ. నిరయమునఁ బెద్దకాలంబు ♦ నికృతిఁబొంది, యిలకు వచ్చి జనింతురు♦హీనజాతి
హీనజాతి జనించిపా♦పానువృత్తిఁ, బాపులగుచుందురటనధః♦పాతమునను.
గీ. ఎట్టి హీనాత్మునకునైన ♦ నేన శరణ, మెట్టిపుణ్యాత్మునకునైన ♦ నేనదిక్కు
నన్ను వర్ణింపమేలు మా♦నవుల కెందు, సత్య మిదినమ్ము హిమధామ♦చారువదన.
వ. అనిన విని భవాని యెద్దాని నెఱింగి భవార్ణవంబువలన నిర్ముక్తులై పురాతనయో గీంద్రులు సనకసనందన సనత్కుమారసనత్సుజాతాదులు నిశ్శ్రేయసంబునొంది రమ్మహాజ్ఞానంబు సవిస్తరంబుగా నానతిమ్మనిన నమ్మహాదేవుం డిట్లనియె. ౧౭౪

మాలిని. శమదమపరినిష్ఠా సర్వభూతానుకంపా
సమనిగమనివృత్తి జ్ఞానవృత్తిప్రశాంతుల్
కమలదళనిభాక్షీ కల్గినన్ గల్గు నయ్యు
త్తమునకుఁ జిరకాల స్థాయికైవల్యలక్ష్ముల్. ౧౭౬

గీ. చిత్తమునఁదుష్టియును సతుష్టియును లేక
యొడలిలోనయ్యు గృహమందు నున్నభంగి
నిస్పృహుండయి యుండంగ నేర్చె నేని
యతఁడు ముక్తుండు పద్మపత్రాయతాక్షి. ౧౭౭

గీ. అవనిగగనాగ్నివాయుజ లాదు లైన
ప్రకృతిసంభూతముల వికారములఁ బాసి
యున్న నామూర్తిఁ బొసఁగాన నొప్పునేని
కతఁడు ముక్తుండు సుమ్ము హైమాద్రితనయ. ౧౭౮

వ. నిత్యానిత్యవివేకుండును నీషణత్రయవిరహితుండును సమాధిషట్కసంపన్నుండు
ను నంతరరిషడ్వర్గవివర్జితుండును నగువాఁడు ముముక్షుండు. ౧౭౯

గీ. తత్పదార్థంబు పరమాత్మ తలిరుఁబోణి, త్వంపదార్థంబు జీవుండు తలఁచిచూడఁ
దత్త్వమూరయ వేదసూత్రంబులోని, యర్థ మది చిత్తమందునీ వలవరింపు. ౧౮౦

గీ. ప్రత్యభిజ్ఞాన మనియెడి ప్రత్యయమున, విశ్రుతంబైనయాత్మ భావింపవలయుఁ
బెద్దకాలంబునకుఁ గన్న ప్రియవయస్యు, నానవాల్పట్టి తెలిసిన యట్లవోలె.

గీ. త్రాడుఁజూచిభ్రాంతి దందశూకంబని, యాత్మవలనఁ దలఁచి నట్లవోలె
వేదశాస్త్రజనిత విజ్ఞానబలమునఁ, దెలివినడసి యాత్మఁ దెలియవలయు. ౧౮౧

వ. నిత్యంబు సర్వగతంబు కూటస్థం బేకంబుదోషవర్జితంబు భ్రాంతివశంబున భిన్నం
బై తోఁచు, ఘటాకాశంబు మహాకాశంబు భిన్నంబుగానేర్చునే? జీవేశ్వరులకు
భేదం బెక్కడిది? పృథివ్యాపస్తేజోవాయురాకాశంబులు శబ్దస్పర్శరూపరసగంధం
బులుమాయాసంసారప్రపంచంబు లేను సదాసాక్షిస్వరూపకుండ నైన జీవుండనని
సమాధినిష్ఠు లైనపెద్దలు తెలిసికొని పరమనిర్వృతి ననుభవింతురు. ౧౮౩

సీ. ప్రణవాత్మవర్ణరూపస్పర్శనామూర్తి, ప్రణవంబు మూఁడక్షరములు గలది
యది పరబ్రహ్మ మేకాక్షరంబున నొప్పు, నది ఋగ్యజుస్సామమందు నిలిచె
ననులోమకము లుదాత్తాదిస్వరములు కాలంబులువర్ణత్రయంబులవియు
వర్ణత్రయంబు సర్వంబు నంతర్భావ, మొందుట యది యేమిసందియంబు

గీ. గతినకారముకారము కారములను, నాత్మమాయను జీవాత్మ నాటుకొల్పి
జీవు నీశ్వరబుద్ధి భజింపవలయు, ధృతి దఱుఁగనీక యెప్పుడు మతివివేక. ౧౮౪

సీ. చైతన్య మెప్పుడు • సర్వంబుఁ దానయై, విలసిల్లుచుండు న • వ్వేళఁగాని
విశ్వభూతములను • వీక్షించుఁ దనయందుఁ, బరిపాటి నెప్పుడ • ప్పాటఁగాని
సకలభూతములకు • సంతసంబునుఁబొంది, యెపుడు వర్తించుఁ దా • నపుడుగాని
యఖిలలోకములకు • నధ్యక్షుఁడైకను, నధ్యక్షుఁ డెప్పుడ • య్యదనఁగాని
గీ. తన్నుఁ గేవలమాత్రగాఁ • దలఁచియిష్ట, మతిశయముగ దృఢముగఁ జూచు • నపుడుగాని
జన్మదుఃఖజరావ్యాధి • శాంతికరము, బ్రహ్మవిజ్ఞాన మూరక • పట్టువడదు. ౧౮౩
గీ. జ్ఞానసంపదఁగాని మో • క్షంబు లేదు, కర్మశతమున నేనియో • నిర్మలాత్మ!
జ్ఞానమనఁగ వేదాంతవి • జ్ఞాన మబల!, యితరవిజ్ఞాన మజ్ఞాన • మెంచిచూడ. ౧౮౪
కం. జ్ఞానాభ్యాసం బల్పంబైన మహాపాతకముల • హరియించును గం
జానన! దీపంబించుక, యైనను హరియించుఁ గాదె • యంధతమంబుల్. ౧౮౫
గీ. వహ్ని సందీప్తమై మహా • వనమునందు సరసనీరసతరుల భ • స్మంబు సేయు
బ్రహ్మవిజ్ఞానమును నట్ల • ప్రజ్వరిల్లి, శుభము నశుభము నొకటిగా • సుడిసి కాల్చు.
గీ. జలజపత్త్రంబు తనమీఁదఁ • జల్లియున్న, యుదకబిందులతోఁ గూడ • కున్నయట్లు
బ్రహ్మవిజ్ఞాని తనమీఁదఁ • బడినయట్టి, విషయమలమునఁబడకుండు • విమలచరిత.
గీ. భక్షితం బైనవిష మెల్లఁ • గుక్షినఱుగు, విమలమణిమూలమంత్రౌష • ధముల చేత
ననుభవించినవిషయంబు • లట్లయఱుగు, బ్రహ్మవిజ్ఞానమునఁ జేసి • పరవ మునికి.
శా. పూవుంబోణి! విశాలలక్ష్మిఁ గనుచుం • బుష్పంబు మూర్కొంచు వీ
ణావాద్యంబులు వించు నిష్టమధురా • న్నంబర్థి సేవించుచు
న్వైభవంగుల నిల్చుచు న్నడచుచు • న్నిద్రించు యోగీశ్వరా!
నీవే కర్తవు సుమ్మటన్నపురుషు • న్బోధింప వేదోఘముల్. ౧౮౬
గీ. జ్ఞానవైరాగ్యసంపన్నుఁ • డయిన పెద్ద, నెఱుఁగలేక యపహసించు • నెవ్వఁడేని
వాఁడు గాల్పంగఁబడుఁ దీవ్ర • వహ్నిశిఖల, రౌరవాదికఘోరనా • రకములందు.
సీ. సజ్జనుండైన దు • ర్జనుఁడైన మూర్ఖైన, బండితుఁడైన నా • తండె ఘనుఁడు
నిరపేక్షుఁ డాతండు • నిర్వైరుఁ డాతండు, సమదృష్టిగూతండు • శాంతుఁడతఁడు
రా జిలజనులచేఁ • బూజఁగైకొనుమాడ్కి, నతఁడు దేవతలచే • నర్చఁగాంచు
నతనిపాదాబ్జంబు • లంటినభూభాగ, మఖిలతీర్థములకు • నభ్యధికము
గీ. వానిజన్మంబు జన్మ మ • వ్వాఁడు సుకృతి, వాఁడు ద్రొక్కినయిల్లిల్లు • వాఁడు దైన
మేకొలంతయు లేకుండు • నింతి! యెఱుఁగు, బ్రహ్మవిజ్ఞానమయశీలి • భాగ్యశాలి.
గీ. ఎవ్వనింటికి బ్రహ్మజ్ఞుఁ • డేగుదెంచుఁ, బ్రియముఁగా పుణ్యమునుగల్గి • భిక్షగొనఁగ
వానిఁ బితృదేవతలు హర్ష • వైభవమునఁ, బొగడుదురు కేలినర్తనా • భోగకముగ.

కం. అనుభవపర్యంతం బెవ్వనిచిత్తము తత్త్వవీథి ♦ వర్తించు మహా
త్ముని నాతనిఁ బొడఁగను సజ్జనులకు నాక్షణమ కిల్బి ♦ షంబు లడంగున్. ౧౯౫

గీ. అన్వయము పావనంబు కృ ♦ తార్థుఁడతఁడు, పుణ్యవతి వార్ధి వేష్టిత ♦ భూతధాత్రిఁ
జెలఁగి యోలాడు నెవ్వని ♦ చిత్తవృత్తి, సచ్చిదానందమయసుధా ♦ సాగరమున. ౧౯౬

గీ. శ్రద్ధ గురుభక్తివిశ్వాస ♦ సౌష్ఠవంబు, జరగెనేఁ గల్గు వేదాంత ♦ సంగ్రహంబు
జరగదా లేదుసత్యంబు ♦ సత్యమిదియు, బహువిధోక్తులపనయించు ♦ బ్రహ్మమిదియు.

వ. ఈ యర్థంబులు దేవతాగురువిశ్వాసంబులు గలవారికిఁగాని ప్రకాశింప నని భవా
నికి భవుఁ డుపదేశించె నని మంకణునకు వసిష్ఠుండు చెప్పెనని శౌనకాది మహా
మునులకు సూతుండు వివరించె. ౧౯౮

శా. ఆకల్పస్థిరధర్మవైభవ! దిశా ♦ హర్మ్యాగ్రసంస్థాపితా
స్తోకస్ఫాటికకుంభవిభ్రమధురా ♦ శుంభద్యశోమండలా!
రాకాచంద్రమసోవిరాజ నవభ ♦ ద్రా! వీరభద్రేశ్వర
క్ష్మాకాంతాగ్రజవేమభూధవకృపా ♦ సంవర్ధితప్రాభవా. ౧౯౯

కం. లింగనమంత్రిసహోదర, గంగాధరదివ్యచరణ ♦ కమలనివాసా
భంగాపరతంత్ర! సమిద్రంగార్జున! యిందుధరధ ♦ రాధరధీరా. ౨౦౦

మాలిని. రవినిభశుభతేజా ♦ రామమాంబాతనూజా
ద్విజగురుచరిత్రా ♦ దేవయామాత్యపుత్రా
భువనభవనకీర్తీ ♦ పుష్పకోదండమూర్తీ
ప్రవిమలగుణసంగా ♦ రాయవేశ్యాభుజంగా. ౨౦౧

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ సకల
విద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైన శ్రీభీమేశ్వరపురాణం బను మహా
ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

శ్రీరామాయనమః.

శ్రీమహా గణాధిపతయేనమః.

శ్రీ మాణిక్యాంబాసమేత శ్రీ భీమేశ్వరస్వామినేనమః.

# శ్రీ భీమేశ్వర పురాణము.

## షష్ఠాశ్వాసము.

శ్రీమహిత దక్షవాటీ
భీమేశ్వరపాదపద్మ పీఠాతిరసా
సామర్థ్యసుప్రవృద్ధమ
హామహిమా! బెండపూఁడి యన్నామాత్యా. ౧

వ. అక్కథకుండు శౌనకాది మహామునుల కిట్లని చెప్పందొడంగె. ౨

సీ. వినుఁడు సద్యోముక్తి విభవైకకారణం, బామ్నాయవిద్యార హస్యపథము
దక్షవాటీమహా స్థానమాహాత్మ్యంబు, వెండియుఁ బరిపాటి విస్తరింతు
నాదిలోకేశ్వరి యఖిలతత్త్వేశ్వరి, భోగమోక్షఫలాను భూతధాత్రి
సంపూర్ణవిజ్ఞాన శాలిని కల్యాణి, శైలేంద్రతనయ హ స్తములు మొగిచి

గీ. పశుపతికి నిట్టులని విన్న పంబుచేసె, దేవదేవ! జగన్నాథ దివిజసంస్త్య!
దేవ తిర్యఙ్మనుష్యాది దీనసంస్థ, యభవ! కృప నాదు విన్నపం బవధరింపు. ౩

వ. సద్యోముక్తిదం బెయ్యది? పుణ్యస్థానం బెయ్యది? యానతిం డనుటయు జగద్ధితా ర్థంబుగా నా వృషభధ్వజుండు భవాని నభినందించి యిట్లని యానతిచ్చె. ౪

కం. సద్యోముక్తికరంబును, సద్యస్సౌఖ్యప్రదంబు సద్యోదురిత
ప్రోద్యమభంగకరంబును, సద్యస్సకలార్థసిద్ధి సంపాదియునై. ౫

సీ. దర్శనమాత్ర నే దైవతగ్రామణి, జనులకు భోగమో క్షము లొసంగు
నమృతాబ్ధిమధ్యంబు నందు నేవేల్పు తేఁ, దుర్వి లింగాకృతి నుదయమొందె
మార్తాండుచే సప్త మౌనిముఖ్యులచేఁ బ్రతిష్ఠఁ గైకొనియె నే దివ్యమూర్తి
యప్సరస్త్రీసకటా క్షావలోకనకళా, పాథేయ మెవనికిఁ బ్రాహుణికము

గీ. విశ్వపతి భీమనాథనా మేశ్వరుండు, శివుఁ డతండు వసించు నే క్షేత్రసీమ
నట్టి శ్రీదక్షవాటీమ హాపురంబు, భుక్తిముక్తికి రెంటికిఁ బుట్టినిల్లు. ౬

వ. తొల్లి కృతయుగంబున నమ్మహాస్థానంబున సంశ్రితవ్రతులును త్రికాలవిహితా చరితస్నానులును భస్మోద్ధూళితసర్వాంగులును రుద్రాక్షమాలికాభరణులును జటా

వల్కలధారులను శంభులింగార్చనాపరాయణులును నగుమహామునులు పెద్దకా
లంబు ఘోరతపంబుఁ జేసిన నత్తపోధనులయుత్తమతపంబునకుఁ జిత్తంబునఁ బ్రసా
దంబు వహించి మంకణసంకల్పకల్పవృక్షం బగునయ్యహికంకణుండు ప్రత్యక్షం
బైన నద్దక్షవాటికాధ్యక్షుని సాక్షాత్కారంబు వీక్షించి పరమర్షులు హర్షోత్కర్షం
బునొంది యందంద దండప్రణామంబు లాచరించి హస్తారవిందంబులు మొగిడ్చి
యిట్లనిరి. ౭

గీ. ఓసదాశివ! యో దేవ ♦ యోమహాత్మ!
యోవిరూపాక్ష! యోమహా ♦ దేవ! యభవ!
వరముఁ గృపసేయు మీదక్ష ♦ వాటమునకు
మ్రొక్కెదము మేము మీపదాం ♦ భోజములకు. ౮

కం. సద్యోభోగశ్రీయును, సద్యఃకైవల్యవిభవ ♦ సౌలభ్యంబు
న్విద్యాసముద్యమంబు న, విద్యానాశంబు దక్షు ♦ వీటికి వలయున్. ౯

చం. అనఁగఁ బ్రహృష్టచిత్తుఁడయి ♦ యర్ధశశాంకకిరీటుఁ డప్పు డి
ట్లను దగనూర్ధ్వరేతసుల ♦ కమ్మునిముఖ్యులకు న్విశుద్ధవ
ర్తనులకు నిచ్చితి న్వరము ♦ దక్షునివీటికి దక్షవాటికి
న్ననుపమరత్నపేటికి మ ♦ నఃప్రమదావహవస్తుకోటికిన్. ౧౦

గీ. ఎల్లకాలంబునుండెద ♦ నిచట నేను, మొదలి మామామయారామ ♦ పదమునందు
వెండిగుబ్బలిపై వేడ్క ♦ వీడుకొల్పి, మేరునగరాజుపైఁ జాల ♦ మెచ్చువదలి. ౧౧

సీ. అగ్రజుండైనను ♦ నంత్యజుండైనను, బాఁబోఁడియైనను ♦ బురుషుఁడైనఁ
బరమమూర్ఖుండైనఁ ♦ బండితుండైనను, దారిద్ర్యగుండైన ♦ ధనికుఁడైనఁ
బలవంతుఁడైనను ♦ బలహీనుఁడైనను, బ్రాయంపువాఁడైనఁ ♦ బంగునైన
నాస్తికుండైనను ♦ ననృతవాదియునైనఁ, బరఁగ గార్దభమైనఁ ♦ బందియైనఁ

తే. గీటకంబైన బకమైనఁ ♦ గ్రిమియునైనఁ, బాదపంబైనఁ దృణమైనఁ ♦ బ్రాణరహిత
మై రహిని దక్షవనచతు ♦ ర్ద్వారసీమఁ, బొందుఁ గైవల్యకళ్యాణ ♦ భోగలక్ష్మి. ౧౨

ఉ. ప్రాణవియోగవేళ నర ♦ పక్షిమృగాళికి దక్షవాటికా
క్షోణినిఁ దారకంబుఁ బుర ♦ సూదనుఁ డానతియిచ్చుచుండఁగన్
పయ్యెద నొయ్యన వీచుచుండు శ
బాణిబిసప్రసూనములఁ ♦ బయ్యెద నొయ్యన వీచుచుండు శ
ర్వాణి త్రిలోకమాత బల ♦ వన్మరణశ్రమభారశాంతికిన్. ౧౩

తే. తూర్పుదిశకును లవణపా ♦ థోధి సీమ, దక్షిణమునకు వృద్ధగౌ ♦ తమియె సీమ
పడమటికి రాజమాహేంద్ర ♦ పట్టనంబు, ద్యుమ్నపతిదిక్కునకు సీమ ♦ తుల్యభాగ.

వ. ఈ క్రమంబున సీమావిభాగంబు లేర్పడిన భీమమండలంబు భుక్తిముక్తిప్రదంబు. హారణంబైనచందంబున దర్శనమా
వహ్నిసంయోగంబున శుష్కకాష్ఠంబులు

త్రంబునఁ బాపౌఘంబును నదిభస్మీభావంబునుం బొందింపంజాలును. ప్రాణవి యోగకాలంబున జంతుకోటికిం గాలకంధరుండు తారకబ్రహ్మవిద్యారహస్యార్థం బుపదేశించును. కానిమాత్రంబైన ధనంబును బిడికెఁడు ధాన్యంబైన నిచ్చు దాతకుననంతఫలంబుచెందు. శ్రద్ధాసమన్వితంబుగా శివయోగికిం బెట్టిన భోజ నంబును నిచ్చిన వస్త్రంబును భవబంధవిధ్వంసనంబులు. జపహోమదానతపో ధ్యానసమాధియోగంబులు గలుగుపుణ్యులకుం గొలఁది లేదు. హిమవత్పర్వతం బునఁ గోటివర్షంబులు తపంబుచేసినఫలంబు ఘటికార్ధోపవాసమాత్రంబునను, వారణాసియందుఁ గోటిబ్రాహ్మణులకు భోజనంబు పెట్టిన ఫలంబు భిక్షునకు నొక్కభిక్ష యిడినమాత్రంబునను, గురుక్షేత్రంబున సూర్యగ్రహణకాలంబునం దులాపురుషదానంబు చేసినఫలంబు నొక్క భూసురాతిథికభ్యాగతికిశివయోగు లకుఁ బెట్టిన భోజనమాత్రంబునను, దక్షవాటికాపుణ్యక్షేత్రంబున సంభవించు.

తే. భీమలింగంబు త్రిభువన♦స్వామియెపుడు, సన్నిధానంబుఁ గైకొని♦యున్నకతనఁ
దీర్థములలోన నుత్తమ♦తీర్థమయ్యె, దక్షిణానందవనవాటి ♦ దక్షవాటి. ౧౮

తే. ఘనత శివగంగ మనుసుద్ర♦గంగయనఁగఁ, గూపములు రెండు దక్షవా♦టీపురమున
మొదలియది పాపములనెల్ల♦నుదకఁజాలు, నొకటిపితృదేవతలఁదృప్తి♦నునుపనోపు.

ఆ. అని వరంబు లిచ్చి ♦ యంతర్హితుం డయ్యె, నిందుమౌళి ఋషుల♦కెట్ట యెదుట
వార లోన్నమశ్శి♦వాయ యంచుఁబఠించి, రొక్కమొగిని దిశలు ♦ పిక్కటిల్ల.

సీ. పంచాక్షరీమంత్ర ♦ పారాయణంబులు, పఠియించుచును స్పష్ట♦ఫణితితోడ
నెచ్చటికేగితో ♦ యెఱుఁగకయున్నార, మెచటికి విచ్చేయ♦కిచట నుండు
మనుచుఁబ్రార్థింపంగ♦నోఁగాకయనిపల్కి, ఋషులుచూడఁగఁజూడ♦నిందుధరుఁడు
భీమనాథేశ్వరు ♦ కామితార్థప్రదు, కామితదివ్యలిం♦గంబుఁజొచ్చె

తే. మెఱుఁగు మెఱిచినపగిదిని♦మెఱియదీప్తి, నద్భుతంబును బొందిరి♦యపుడువారు
గారి! యిది భీమలింగంబు♦గౌరవంబు, దక్షవాటీపురీమహా♦స్థానమునను. ౧౯

వ. అనంతరం బమ్మునీశ్వరులు నియమశ్రద్ధాతాత్పర్యంబు లొప్పసప్తర్షిసమానీతయగు గోదావరిఁగనుంగొని పరమానందంబున. ౨౦

శ్లో. దేవి! శంభోర్జటాజూట, నివాసిని! శివప్రియే!
లోకరక్షణకార్యార్థ, ముద్భూతాయై నమోస్తు తే. ౨౧

శ్లో. ఏకేనైవస్వరూపేణ, భీమనాథస్యసన్నిధౌ
సదా సన్నిహితా స్యత్ర, గోదావరి! నమోస్తు తే. ౨౨

కం. అని సంస్తుతించి యందఱు, మునిగణములు మంకణముని♦మునుకొని వికచ
త్కనకారవిందసౌరభ, ఖని యగునయ్యేటినీటఁ ♦ గొతుకమొప్పన్. ౨౩

వ. అఘమర్షణస్నానమాడిరి. ౨౪

తే. అఖిలకాలంబునొకప్రవా•హంబుతోడ, భీమలింగంబు సేవించి • బెరసిప్రేమ
యొరసిమదినుబ్బుపాతాళ • మొరసిహరి, సప్తసింధువుమున్నీటి • సంక్రమించె.

తే భీమలింగంబుమ్రోల గాం•భీర్యసలిల, పూరమగుచుండు నేకాల•మునుసమృద్ధి
దనిపి తగఁబొలుచుండు ని•త్యమ్ముఘన ము,దారజలనిధి సప్తగో•దావరంబు. ౨౬

ఉ. ఏటమునింగి లేచిపర• మేశ్వరుమందిరసౌధవాటికా
హాటకకుంభముఁ గని ష•డక్షరమంత్రము జిహ్వఁగూర్చివా
చాటత సత్యతత్త్వఁడగు • శాంభవయోగివరేణ్యుఁడేలజం
జాటపుసంసృతింబొరలి • చచ్చుచుఁ బుట్టుచునుండుఁ బార్వతీ. ౨౭

చం. కొడుకులునీవునేఁ బమ్రథ•కోటివిరించిసరోజలోచనుం
డుడుగణరాజఖేచరమ•హోరగకిన్నరసిద్ధసాధ్యులె
ప్పుడుగొలువంగవైభవము•పొంపిరివోవఁగ దక్షవాటినుం
డెడుశివు భీమనాయకుఁ ద•టిన్యనతేంను భజింపమేలగున్. ౨౮

కం. సప్తాశ్వసంప్రతిష్ఠుని, సప్తమునీశ్వరప్రధాన•సంస్థితు నంత
ర్గుప్తస్వరూపుఁ ద్రిభువన, గోప్తను భీమేశ్వరేశుఁ • గొలువుము తరుణీ. ౨౯

వ. భీమనాథమహాస్థానంబు సర్వకామార్థసాధకంబు; సంవత్సరంబును గొలువ ముక్తి ప్రదాయకంబు. సూర్యుండు మేషరాశియందుఁ జిత్రానక్షత్రంబున వసియించి యుండు చైత్రమాసంబున సప్తగోదావరంబునఁ బ్రాతస్స్నానంబుఁ జేసి యథాశక్తి పిప్రులకుఁ దగినదానంబు లొసఁగి, భీమనాథుండ నగునాకు నమస్కారాభిషేకపూజానైవేద్యంబు లాచరించి నరుండు నక్తభోజియయ్యును నట్లె భానుఁడు వృషభరాశియందు విశాఖానక్షత్రంబు నాశ్రయించియుండు వైశాఖమాసంబునను, ప్రభాకరుండుమిథునంబునందు జ్యేష్ఠానక్షత్రంబునందు నిలిచియుండు జ్యేష్ఠమాసంబునను, రవి కర్కాటకంబున భగదైవతంబైన నక్షత్రంబున నాషాఢమాసంబునఁ గూడియుండఁగను, శ్రావణమాసంబున శ్రవణనక్షత్రంబున సింహరాశియందు మార్తాండుఁడు నిలిచియుండఁగను, భాద్రపదమాసంబునఁ బూర్వాభాద్రానక్షత్రమునఁ గన్యారాశియందు భానుండుండఁగను, నాశ్వయుజమాసమునఁ నశ్వినీనక్షత్రంబునందుఁ దులారాశియందుఁ జిత్రభానుండు నిలిచియుండఁగను, గార్తికమాసంబునఁ గృత్తికానక్షత్రంబున వృశ్చికరాశిని సూర్యుం డుండఁగను, మార్గశీర్షమాసంబున ధనూరాశియందు మృగశిరానక్షత్రంబున నభోమణి యుండఁగను, బుష్యమాసంబునఁ బుష్యనక్షత్రంబున మకరరాశియందు లోకబాంధవుఁ డుండఁగను, మాఘమాసంబున మఘానక్షత్రంబునఁ గుంభరాశి,

యందు మిహిరుండుండఁగను, ఫాల్గునమాసంబున నుత్తరానక్షత్రంబున మీనరా
శినిం దినకరుండుండఁగను, బూర్వోక్తప్రకారంబున శైవవ్రతాచారంబులు నడ
పిన మనుజుండు, పాతకంబులవలన విముక్తుండగును; వెండియు యజ్ఞతీర్థం బను
తటాకంబు సకల తీర్థరాజంబు. ౩౦

సీ. మేషరాశిస్థుఁడై ♦ మిహిరుఁడుండఁగఁ బర్వ,తిథి స్నాతుఁడగుచుఁద ♦ త్తీర్థమందుఁ
దనయథాశక్తిఁ గాం ♦ చనము విప్రులకిచ్చి, పాతకంబులఁ బాయుఁ ♦ బంచజనుఁడు
వృషభంబునం దట్ల ♦ వెండిమార్తాండుండు, మిథునరాశిం దగ ♦ మెచ్చు మీఱు
స్థితిఁ గర్కటకరాశిఁ ♦ గృతసప్తగోదావ,రాభిషేకుఁడు దోష ♦ మపనయించుఁ
తే. దప్పకాషాఢసితచతు ♦ ర్దశిని సింహ, కన్యలను సూర్యసంగమ ♦ కాలమునను
జన్మతారలయందున ♦ సంధులందు, యజ్ఞకుండపయస్స్నాన ♦ మఘహరంబు. ౩౧

తే. భానుమంతుండు తులమీఁదఁ ♦ బవ్వళింప, యజ్ఞకుండతటాకంబు ♦ నందుఁ గ్రుంకి
బ్రహ్మహత్యాదులైన పా ♦ పనిచయములఁ,బంచబంగాళముగఁ దోలుఁ ♦ బంచజనుఁడు.

కం. ఆదిత్యుఁడు వృశ్చికమునఁ, బాదం బిడినట్టి వేళఁ ♦ బావనతిథి సూ
ర్యోదయమున యజ్ఞతటా,కోదకమునఁ గ్రుంకి మనుజుఁ ♦ డోడుచు నఘంబుల్. ౩౩

తే. ఇనుఁడు కోదండరాశియం ♦ దెక్కియుండ, రుద్రనక్షత్రమునను మ ♦ ర్త్యుండు నియతి
యజ్ఞకుండపయస్స్నాన ♦ మాచరించి, సృష్టిలోఁ దోలుఁ బాతక ♦ శ్రేణినెల్ల. ౩౪

తే. మకరరాశిస్థుఁడై భాను ♦ మంతుఁడుండఁ
బుష్యనక్షత్రమునఁ బ్రొద్దు ♦ పొడుచునపుడు
భానువాసరమున యజ్ఞ ♦ భద్రసరసిఁ
గ్రుంకి పాతకచయముల ♦ పొంక మణఁచు. ౩౫

కం. మాఘమునఁ గుంభరాశి ని,దాఘద్యుతియుండ సప్త ♦ తాపసవాహి
న్యోఘమున మునుఁగు నరుఁ డఖి, లాఘవిఘటితుఁడగుచుండు ♦ హావప్రౌఢిన్.

తే. ఫాల్గునంబున నుత్తరా ♦ ఫల్గునిని, మీనరాశిని సూర్యుండు ♦ మెలఁగుచుండ
సప్తగోదావరాభిషే ♦ చనము సేయఁ, బాతకవ్రాతములనెల్ల ♦ భంగపఱుచు. ౩౭

మ. ప్రతివేళం దగ మర్త్యుఁ డీక్రియఁ జరిం ♦ పం బాడి యంగీకృత
వ్రతుఁడై దక్షిణకాశియందు బహుళ ♦ స్వర్గాపవర్గార్థమై
శితికంఠప్రియమందిరంబయిన యీ ♦ క్షేత్రంబునం దెచ్చటన్
మృతుఁడై యున్ననరుండు పొందు గమిక ♦ ర్మీభూతకైవల్యమున్. ౩౮

కం. కనకం బణుమాత్రంబై, నను దక్షారామనగర ♦ నైకటికమహా
మునిసింధుపుదరి దానం, బొనరించుట మేరుదాన ♦ మున్విం దలఁపన్. ౩౯

తే. వర్తనం బెల్ల శంభుసే•వాప్రతంబు, మాటలెల్లఁ బంచాక్షరీ•మంత్రరాశి
భోగమోక్షనివాసైక • భూమియైన, దక్షపురినున్నజనులకో•తలిరుఁబోణి. ౪౦

వ. దక్షారామమాహాత్మ్యం బవాఙ్మానసగోచరంబు. భీమనాథ మహాదేవదివ్యశ్రీపాద పద్మసేవావ్రతంబువలన నెట్టి పాపకర్ముండును భోగమోక్షపదవీ సామ్రాజ్య పట్టాభిషేకమహాదివ్యపదవినొందు. సర్వశాస్త్రసిద్ధాంతమతాంతరంబులకు సమ్మతంబైన యిమ్మహాస్థానం బేకవటీభూతంబు సద్యోముక్తిప్రదంబు సద్యఃపరిజ్ఞానసదనంబు సద్యఃకళాసమృద్ధిప్రదంబైయుండు ననిదయార్ద్రమానసుండై వృషభధ్వజుం డాదేవి నుద్దేశించి పార్వతీ నీవడిగినయర్థంబు సర్వంబుసమర్థించితి. చిత్తంబున నవధానంబుసేయుమనినం బతికిఁ గరంబులు మొగిడిచిమ్రొక్కి భవానిహర్షోత్కర్షంబునొందె, నీరహస్యంబేనును గురుముఖంబున నెఱిఁగి ప్రసంగవశంబునం బ్రహ్మాదులగు మీకు నుపదేశించితి. ౪౧

శా. సద్యోముక్తిప్రదంబుదక్షనగరీ•స్థానంబు విశ్వేశ్వరుం
డాద్యుం డవ్యయుఁ డానతిచ్చె నిదివే•దార్థంబు; సద్యోవిము
క్త్యుద్యోగం బనుపేక్షయైన నదిసుం • డొండొక్క తీర్థంబు పు
ష్పోద్యానవ్యం బనఁ గాల మందుఁ గడుపర్ • యోగంబు భావింపఁగన్. ౪౨

వ. మఱియు భీమలింగమాహాత్మ్యంబు భవకలుషనాశనంబు బ్రహ్మవిష్ణు పురందరాదులకుఁ గల్పకోటిశతంబులనైన వచియింపనలవిగాదు. అయినను నానేర్చువిధంబున నింక వర్ణించెద. ౪౩

తే. భువనములమూఁటియందును • బొబ్బవిడుచు, నంతదాఁకనె యిశరథీ•ర్థాదులెల్ల
నపుడు భేదంబు లేదని • రవనిమీఁద, దక్షవాటీపురీభీమ•ధామమహిమ. ౪౪

సీ. దక్షుండుపొట్టేలి•తల ధరించినయప్డు, భారతి ముక్కు గో•ల్పడినయపుడు
పూషాస్యవదనంబు • బోసివోయినయప్డు, విష్ణునిచక్రంబు • విఱిగినపుడు
అగ్నినాలుక లేడు • నోడుమాసినయప్డు, దుడురాజు పొట్టిగు•జ్జుఱికినపుడు
జన్నంపుటిఱ్ఱిసు• నెత్తకము ద్రెల్లినయప్డు, వడిపక్షుతల చిచ్చు•వడినయపుడు

తే. ప్రాణభయమునముక్తిసం•భ్రమముమెఱయ
నమ్మహోత్పాతకాలంబు•నందుమునులు
దైవగంధర్వసిద్ధవి•ద్యాధరులును
నేమమునగొల్తు రెవ్వాని• నెమ్మనమున. ౪౫

సీ. దుగ్ధాబ్ధిమంథనో•ద్భూతహాలాహల,జ్వలన మేచకకంఠ • శరణు శరణు
గిరిచాపనిర్ముక్త•హారిశిలీముఖదగ్ధ,పురగోపురాట్టాల•శరణు శరణు
సింధురాంధజలంధ•రాంధక వ్యాఘ్రాది, సురకంటకధ్వంస • శరణు శరణు
విలయసంధ్యాకాల•వికటతాండవకేళి, జర్జర బ్రహ్మాండ • శరణు శరణు

తే. శరణు ఖేచరదేవతా♦సార్వభౌమ, శరణు త్రైలోక్యసతతర ♦ క్షౌధురీణ
శరణు దక్షిణకాశికా♦స్థాననిలయ, శరణు భీమేశశంకర ♦ శరణు శరణు. ౪౬

కం. హర! సర్గస్థితినాశన, కర! సంసారాబ్ధితరణ♦ఘనతరచరణాం
బురుహప్లవ! రక్షింపుము, శరణాగతులైనమమ్ముఁ ♦ జంద్రాభరణా. ౪౭

కం. అపరాధశతము లోఁగొను, మపరిమితకృపావిధేయ ♦ యార్తశరణ్యా
త్రపుసీకుసుమాభరణా, కపర్ది! జటాజూటకోటి ♦ ఘటితశశాంకా. ౪౮

తే. సుప్రకాశుండవగుమువి♦శ్వప్రకాశ, శర్వ! సర్వేశ! త్రిపురభం♦జన! గిరీశ!
యనుచునందందనంకలు ♦ నభినుతింప, నచటభీమేశ్వరేశ్వరుం♦డభవుఁడపుడు.

ఉ. సన్నిధిచేసి వారలకు♦శాక్కరకేతుఁడు సుప్రసన్నుఁడై
యెన్నికకెక్కఁగా వరము♦లిచ్చె ననేకము లింతనుండి నా
మన్నన దక్షవాటిక స♦మస్తమహీవలయంబులోన నా
సన్నగఁదీర్థరాజపద♦భాజన మయ్యెడు నెల్లకాలమున్. ౫౦

కం. ఈ దక్షారామమునకు, మేదినిఁగల తీర్థకోటి ♦ మిగులకయుండున్
మేదురకరుణాగరిమను, సాదరముగ ఖచరసిద్ధ♦జనహితబుద్ధిన్. ౫౧

తే. దక్షుఁ గ్రీర్తించి యాచంద్ర♦తారకంబు, దక్షవాటిక సకలతీ♦ర్థంబులందు
నుత్తమంబుగ వర మిచ్చి♦యుందు మిచట, నేర్పుగను నేరికినిముందు♦నేను నుమయు.

సీ. యజ్ఞకుండంబున♦యందుఁ దీర్థంబాడుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁడతఁడు
గ్రుంకుతేపులుసప్త♦గోదావరంబునఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
ద్వాదశక్షేత్రయా♦త్రావిధాన మొనర్చుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁడతఁడు
దక్షవాటీమహా♦స్థానంబునందుండుఁ, బాయ కెవ్వండు నా♦భక్తుఁ డతఁడు
తే. తెరువునడిచెడువారికి ♦ నిరవుచేసి, ధాన్యములు నెయ్యినూనె వ♦స్త్రములులవణ
మాదిగాఁగల యాత్రాప♦దార్థసమితిఁ, బాయ కెవ్వండుపెట్టునా♦భక్తుఁడతఁడు.

కం. మాటలు వేయును నేటికిఁ, జాటించెద శివుఁడు వేడ్క♦జగములలో ము
న్నీటి దరి దక్షవాటికి, సాటిగఁ దీర్థములు లేవు ♦ సత్యము సుండీ. ౫౪

తే. బ్రహ్మవిద్వాంసులకుఁ బాశు♦పతియతులకుఁ, బెట్టుధనధాన్యవస్త్రాన్న♦భిక్షమెవ్వఁ
డక్షయగుణంబుగాఁగ నీ♦దక్షవాటి,వాని కలవడు నిజము కై♦వల్యపదవి. ౫౫

తే. చప్పరంబొండె గుడియొండెఁ ♦ జవికయుండెఁ
గలుమతం బొండె నిల్లొండెఁ ♦ గట్టి పెట్టి
బ్రహ్మయోగీశ్వరుని నుంచు ♦ భక్తినెవ్వఁ
డతఁడు మాన్యుండు పూజ్యుండు ♦ నతులితముగ. ౫౬

వ. తొల్లి జలంధరగంధగజపుండరీకాంధకాసురాదు లగుమహాదైత్యులు భువనత్ర
యం బాక్రమించిన శక్రుండు భయభ్రాంతుండై దేవగణదేవమునిసిద్ధసాధ్య
విద్యాధరోరగగరుడగంధర్వకిన్నరకింపురుషాదులం గూర్చుకొని బ్రహ్మకు విన్న
వించిన విరించియు వారిందోడ్కొని పాలమున్నీటిలో ఫణిరాజతల్పంబుపైఁ బవ్వ
ళించిన పాంచజన్యధరునకు విన్నపంబు చేసి సంస్తుతించినఁ గైటభారిహాటకగర్భుని
విన్నపంబవధరించి చింతాభరంబున నొక్కింతదడ వూరకుండి పుండరీకాసనుం
జూచి యి ట్లనియె. ౫౭

తే. వీరభద్రుండు చక్రంబు ♦ విఱిచి దక్ష
యాగమున నాఁడు భక్షించె ♦ నాగ్రహమునఁ
జెఱకు శర్కర పాకంబు చేసినట్టి
చక్కిలముఁబోలె ఛటఛటా ♦ శబ్దమొప్ప. ౫౮

ఉ. కోపముచిచ్చునంబడిన ♦ కూరిమితల్లిఋణంబు దీఱ ను
ద్దీపతరాగ్రహంబునను ♦ దేవతలం గడుభంగపెట్టఁగా
నేపున నేను మార్కొని పఱియిం బఱతెంచినయంతమాత్రలో
జాపరమేశ్వరా యనుచుఁ ♦ జక్రము మ్రింగిన నోహటించితిన్. ౫౯

తే. తెగువ దక్షునికంఠంబు ♦ ద్రెవ్వనేసి, వ్రేల్చెఁ దల నధ్వరాగ్నిని ♦ వీరభద్రుఁ
డాప్రజాపతి మెడమీఁద నక్షుణంబ,నగుచుఁ బొట్టేలితలఁ దెచ్చి ♦ నాటుకొలిపె.

వ. అప్పు డవ్వీరభద్రుని తేజోవిశేషంబును గనుఁగొనఁగన్నులు మిఱుమిట్లుగొన వెఱ
చఱచి యొలుంగుడించి తొలంగితి నాఁటనుండియు. ౬౧

శా. పట్టంగైదువు లేక విన్ననయి నా ♦ బాహార్గళుల్ చూడుఁడా
యిట్టుంగాక సురేంద్ర! బాధపడి మీ ♦ రిబ్బంగి దుఃఖింపఁగాఁ
గట్టాపో యిటు మిన్నకుండుదు నె ♦ శీఘ్రంబిప్డు భీమేశ్వరుం
ముట్టంగొల్చెదఁ జక్రలాభమునకై ♦ ముగ్ధేందుచూడామణిన్. ౬౨

వ. అని పలికి నలినసంభవేంద్రాదు లగునిర్జరులతోడంగూడి సరోరుహాక్షుండు
దక్షారామంబునకు వచ్చి శివగంగాకూపంబునఁ ద్రిషవణస్నానంబు చేసి భస్మో
ద్ధూళితగాత్రుండును, త్రిపుండ్రాంకితమస్తకుండును, రుద్రాక్షమాలికాధరుండును
జటావల్కలసంయుతుండునునై నిత్యంబును సహస్రపద్మంబులఁ బూజఁగావించుచు
భీమనాథేశ్వరేశ్వరు సేవించుచుండెనంతఁ గొంతకాలంబునకు. ౬౩

కం. ఈభంగి వేయుదమ్ముల, నాభుజగాభరణు నెప్పు ♦ డర్చన సేయన్
శ్రీభీమేశుండు కమల, నాభుని మనమరయ నొక్క ♦ నలినముదాఁచెన్. ౬౪

తే. తొంబనూఱునుదొంబది ♦ తొమ్మిదియును
జలజములుపూజచేసెను ♦ శార్ఙ్గపాణి
వేయిటికినొక్కపద్మంబు ♦ వెలితియైన
నహహానియమంబునకు భంగ♦మయ్యెననుచు. ౬౫

చం. కటకకలాపసంఘటిత ♦ కమ్రమణికద్యుతిపాటవంబునం
జిటికినవ్రేలిగోరఁగొని ♦ చిఱ్ఱునఁదీసెను లోచనంబుఁ బ్ర
స్ఫుటకమలంబు వేగహరి ♦ పూన్చెఁ దటుక్కున దక్షవాటికా
కటకవిలాసినీవిటశి♦ఖామణికిన్ హరిణాంకమౌళికిన్. ౬౬

కం. కైటభవిరోధిభక్తిర, సాటోపం బెసఁగ వనరు♦హాలోకనము
ద్ఘాటించి భీమనాథుని, హాటకపదవీఠిలోచ ♦ నాబ్జముఁ బెట్టెన్. ౬౭

మ. నిడువాలుంగుడికన్ను పాదములపై ♦ నేమంబుతోఁ బెట్ట న
ప్పుడు ప్రత్యక్షముఁబొంది నీలగళుఁ డం♦భోజాక్షునిం జూచి నేఁ
గడుహర్షించితి నిచ్చెదన్వరము వే♦కైకొమ్ము నా నమ్రుఁడై
యడిగెన్ శౌరి జగత్త్రయోద్ధరణలీ♦లావక్రమున్ జక్రమున్. ౬౮

తే. భీమనాథుఁడుత్రిభువన♦స్వామియిచ్చె, నస్త్రకులదైవమననొప్పు ♦ నాయుధంబు
హరికి నటమున్నయిచ్చెఁ జం♦ద్రార్ధమౌళి, వికచపద్మోపమం బైన♦ వెడఁదకన్ను.

వ. ఇవ్విధంబున శ్రీభీమనాథ మహాదేవునివలనం జగద్విజయం బగుచక్రాయుధంబు వడసి కోటిసహస్రమార్తాండమండలతేజఃప్రభాప్రభావభాసమానం బైన యా రథాంగంబునమున్న చెప్పంబడ్డవిబుధవిరోధులఖండించి యింద్రాదిప్రముఖనిఖిల బర్హిర్ముఖవ్రాతంబునకుఁ జేతఃప్రమోదం బాపాదించె నిది యమ్మహాదేవుని మహిమంబు. ౭౦

కం. శివగంగాజలముల నా, ప్లవనంబొనరించినట్టి ♦ పరమాత్ములు త
ద్దివసమున భీమనాథుని, నవలోకింపంగఁ గలుగు ♦ నభిమతసిద్ధుల్. ౭౧

తే. మదనవిధ్వంసితిరిచుట్టు ♦ మాలెయందు, దక్షిణపుదిక్కునందు మా♦ధవునిఁగాంచి
రహిని వేడుక విఘ్నాది♦రాజుఁజూచి, మనుజుఁ డిష్టార్థసిద్ధిసం♦పదలనొందు. ౭౨

తే. అష్టమీభానువాసరం♦బందునొండె, నొండెనేనిచతుర్దశి ♦ నిండుభక్తిఁ
బూజఁగావించియెవ్వఁడే ♦ భూమినున్న, దుర్గసేవింపదురితంబు♦దొలఁగునంద్రు.

కం. తాండవభవువీక్షణమున, ఖండేందుశిఖావతంసు ♦ కట్టెదురుగఁదా
నుండెడుగౌరిని మంచుం, గొండసుతం బూజసేయఁ ♦ గోర్కులునిండున్. ౭౪

సీ. భూర్భువస్స్వర్లోక♦ములుమూఁడుభేదించి, బ్రహ్మాండభాండక♦ర్పరముదాఁకఁ
బెరిగిదిక్చక్రంబు ♦ పిక్కటిల్లఁగఁబట్టి, బలిసికుప్పసముతోఁ ♦ బాముపోలె

నిరవకాశంబుగా ♦ నిత్యసన్నిహితంబు, నుడులింగమూర్తితో ♦ నుబ్బియుబ్బి
భీమనాథుఁడు మహా♦భీమాద్భుతప్రౌఢి, బహువిరాడ్రూపవి♦భ్రాజియయిన

తే. భయమునుం బొంది దేవతల్ ♦ ప్రస్తుతించి, యయ్యనీరూపమింతింత♦యనఁగరాదు
యేదిమొదలేదికడపల ♦ యేదిమధ్య, మెట్టునినుఁ బూజసేయుదు♦మిందఱమును.

వ. అనినం గరుణాసామ్రాజ్యపట్టాభిషిక్తుం డగునాజగజట్టి వేల్పు బ్రహ్మాండగోళంబునకు మిక్కుటంబుగాఁ బెరిఁగిన దేహంబుఁ బొట్టిచేసి తిరుచుట్టుమాలికలోన గౌరీ, జనార్దన, రుద్ర, కేశవ, వినాయక, దుర్గాతాండవేశ్వర, నృత్యభైరవులను దేవతాసప్తకంబు పరివేష్టింప, సకలలోకానందకరపరదారగమనపాపహరేశ్వరులునై ఋతిభాగంబున నధివసింప, నంతర్గర్భగృహంబులోపల మాణిక్యాదేవిసహితుండై సలిలనిధివృద్ధగంగాకౌంతేయసరిత్తుల్యభాగా హేలానదీసప్తగోదావరమాతృకా పరివృతమండలంబున మధ్యమలోకభాగధేయంబును, విబుధగంధర్వపతాకావేదియుఁ, బరిసరోద్యానవాటికాసరసకాసారకశోరకుహళీపాళికాకుసుమధూళీమధూళికాసారభాసార సంవాసితదశదిశాముఖంబును, మఖకుండితటాకసముద్దండపుండరీకషండమకరందబిందుగండూషావ్యగ్రసముదగ్ర మధుపమండవాహంకార ఝుంకారకోలాహల కరంబితమకరధ్వజభుజాదండమండలీకృత కుసుమకోదండశింజినీ ఠంకారంబును, నాఖండలాదిదిక్పాలకభరితకలితగోపురప్రాంగణంబును, బాదుకాఖడ్గఘుటికారసరసాయనిమూలికాంజనాకర్షణాదృశ్యాది విద్యాసిద్ధిక్షేత్రంబును, నత్ర్యాత్రేయాగస్త్యహారితాంబరీషాసిత భార్గవ పరాశర పారాశర్య మాండవ్య మార్కండేయ మౌద్గల్య మంకణ శౌనక శాండిల్య మందపాల వత్స వసిష్ఠ వాధూలసవాలఖిల్య కౌండిన్య కాశ్యపకణ్వగాలవగాధి గార్గ్యప్రముఖ వాలఖిల్యాద్యష్టాశీతిసహస్రసంయమిసమాకీర్ణంబును, గర్ణికాగాంబికాకరకమలపుటఘటితకనత్కనకమణిమయడమరుకఢమఢమధ్వానపర్జన్యగర్జాసముజ్జృంభిత గుహాశిఖండితాండవంబును మార్కండేశ్వరకుండలాముఖసంవేద్యాంతర్వేదిచాళుక్య భీమేశ్వరప్రధాననానావిధశాఖోపశాఖాతీర్థసంబాధసంభరితంబును నై యఖిలభువనభవనాభిరామంబైన దక్షారామంబును గైలాసమేరుమందరంబులకం టెను, గాంచీ చిదంబర కాళహస్తి కాశి శ్రీశైలాది మహాస్థానంబులకం టెను, సేతు కేదారంబులకంటెను, నతిశయంబుగాఁ జేసి నాక్షేత్రంబునుమరగి గరళకూటకృపీటభవజ్వాలానష్టంభంబు సంస్తంభించి, త్రిపురదైతేయమదవతీగండ భాగమకరికాపత్రభంగంబులు దొలంగించి భీమలింగంబు సర్వమంగళాదేవియుం దానును లోకరక్షణార్థంబుగా నధిష్ఠించియుండును.

తే దేవదర్శనమాత్ర సం॥ధిల్లు భుక్తి, గొందఱకు దక్షవాటికా॥క్షోణియందు
దేవదర్శనమాత్ర సం॥ధిల్లు ముక్తి, గొందఱకు దక్షవాటికా॥క్షోణియందు. ౭౭

తే. గీతవాదిత్రనృత్యంబు॥ కేవలంబు, శంభునకు సార్వకాలంబు॥సంభ్రమింప
నప్సరస్త్రీలనర్పించె॥ నాఱునూఱు, బాలలను యువతుల జంభ॥భంజనుండు.

శా. ఆవంశంబున నానికూఁతులయి ది॥వ్యస్త్రీలు దుగ్ధాబ్ధిమ
ధ్యావిఖ్యాతలు మీనకేతనుని పు॥ష్పాస్త్రంబు లెక్కాలముం
సేవాదక్షతఁ గొల్తు రిందుధరునిన్॥ శ్రీదక్షవాటీశ్వరుం
గైవల్యాధిపు భీమనాథుని లస॥త్కారుణ్యపాథోనిధిన్. ౭౮

వ. మఱియు మహనీయ దేవగంధర్వాప్సరోవేశ్యాజాతిసంజాతకాంతాచికురతిమిరాంగ సుమంగళవిభావరీ లలాటశశికళావిలాసద్వితీయభ్రూలతాలాసికాలాస్యలలితరంగ భూమియు, నయనశంబరానుబంధనవకందర్పపతాకయు, నధరబంధూకకుసుమయు, వికాసవిభ్రమశరద్వేళాకంబుకమనీయకంఠయు, బిబ్బోకసరిదంబుధరవేణియుఁ, బృథులతాచక్రవాకయుఁ, గరపల్లవస్ఫురణపర్యాయవల్లీమతల్లీ పన్నగపరివత్తునుంబోలెఁ, బ్రకటితవిలాసమన్మథలీలయుంబోలె, రతిసుఖసంపత్సంపాదనలంపటకు ముదినియుంబోలె, రాజానుకూలదర్శన కేశభరంబునఁ గృష్ణవదన, వచోమనోహరవశంబునమంజుఘోష, మధ్యంబున మందోదరి, యూరుయుగళంబున రంభ, కనకభూషణధారణంబున రుక్మిణి, సురతకళాకౌశలంబున దక్షిణ, తనువున భద్ర, పుష్పాస్త్రద్వితీయజన్మభూమి కారుణ్యవతి, తారుణ్యవతి, కాంతిమతి, కమనీయవతి, వినయవతి, విభ్రమవతి, విజ్ఞానవతి, వితీర్ణవతి, త్రపావతి, భూషణవతి, భూషణమరీచిజాలాకారవిగ్రహయగుట విద్యుద్ఖండంబువలనను బ్రసవపరిమళహారిణియగుటం బారిజాతకోరకంబులవలనను, నిశ్వాసామోద కారిణియగుట మలయమారుతంబువలనను, నిఖిలేంద్రియామోదకారిణియగుట నటనామృతంబువలనను, మాధుర్యజన్మభూమియగుట నిక్షుకాండంబువలనను, బ్రభవించెనో యనఁ బ్రశంసాస్పదంబైయుండు నవ్వంశంబునం దిందుముఖుల యాననచంద్రమండలంబుల యందభ్యర్ణరోహిణీ పాశశృంఖళోద్వృత్తినింబోలె లాంఛనహారిణంబు ప్రవేశింపవెఱచు; నాచంచలాక్షుల దృగంచలస్ఫురణంబు లించువిలుకానికిం బంచబాణంబులు పువ్వులగుట నవ్వటాలమాట; యప్పణంతుల లలాటకర్పూరతిలకంబు దర్పకునకు ధవళాతపత్రంబు శశాంకబింబంబనుట బొంకు. ఆ పువ్వుఁబోణుల కటివంకకనుబొమ్మలె యంగజునకు సింగిణివిండ్లల్లచెఱకు విల్లనుట కల్ల; యత్తొయ్యలుల నెత్తావి యూర్పుగాడ్పులె పుష్పబాణునకుఁ బ్రాణసఖులు చందనాచలసమీరణంబు సఖుండనుట యకారణచిత్తప్రశ్యావహంబు.

అది గావున నుత్తమనాయికా నాయక గర్భజనిత లైన యాసాములు సానురాగం
బున నీశానుని, భీమేశ్వరుని ఘుసృణముకుళితాపాంగంబులు కుంచితాకుంచిత
భూతంబులు విస్మయోత్పాదనతానకంబులు, ప్రసన్నంబులు, ప్రేమరసపూర్ణ
త్రపావృతారంభంబులు, ననలలితంబులు, పులకావళికారణంబులు, భావజగర్భి
తంబులు, విస్మృతనిమేషంబులు నైనవీక్షణంబులఁ దదీయలావణ్యపూరంబాస్వా
దించువిధంబు నభిలషించుటఁ దెల్పుచందంబున హృదయంబు నాకర్షించుచా
డ్పునఁ జామరవ్యజనవీటికాకరండపాదు కాముకురదీపికాసంగీత నాట్యాద్యుప
చారసేవావిశేషంబులఁ బ్రతిసంధ్యంబును బల్యంకికా సేవాబహిర్విజయాది
భోగానసరసమయంబున సేవించుచుండుదురు. ౮౦

తే. దక్షవాటీపురీచతు • ర్ద్వారములను, భీమమండలికాపుణ్య • భూమియందు
శంభులింగప్రతిష్ఠలు • సంఘటించి, యెల్ల వేల్పులు ప్రార్థించి • రిందుధరుని.

వ. ప్రార్థించి శ్రీభీమేశ్వరమహాదేవునివలన నాత్మప్రతిష్ఠితశంభులింగంబులకునువరం
బులడిగిన నవ్విరూపాక్షుండు వారుకోరినట్ల భుక్తిముక్తిప్రదానసామర్థ్యంబులు,
సర్వలింగంబులకుఁ గలుగ ననుగ్రహించె. ౮౧

తే. సప్తసింధువునకు భీమ • శంకరునకు, నడుమనింద్రేశ్వరము పాప • నాశనంబు
దృష్టిమాత్రన భుక్తిము • క్తిప్రదంబు, దేవలోకాధిపతిసంప్ర • తిష్ఠితంబు. ౮౩

కం. భీమయదేవుని దక్షిణ, భూమీభాగమున యజ్ఞ • పురుషేశ్వరది
వ్యామృతలింగము భోగ, శ్రీముక్తివిభూతిదాయి • సేవకతతికిన్. ౮౪

ఆ. అగ్నికుండ మనఁగ • నచ్చోటనున్నది, ధాత్రిభుక్తిముక్తి • ధాతునీవి
దానఁ దీర్థమాడి • తర్పణ మొనరింపఁ, బితరు లూర్ధ్వలోక • గతులుగంద్రు. ౮౫

తే. కృత్తికాతారకంబులఁ • గీలుకొన్న, దినమునం దగ్నికుండికా • తీర్థమాడి
శంభునగ్నీశ్వరునిఁ జూచు • సజ్జనులకు, లలితకరతలధాత్రీఫ • లంబుముక్తి. ౮౬

సీ. అగ్నీశ్వరునిమ్రోల • నగ్నికుండికకూప, తటదేశముననుండు • దక్షకుండి
యదిసర్వపాపౌఘ • ముదిరఝంఝానిలం, బాకూపమునకు యా • మ్యంబునందు
దాక్షాయణీదేవి త్రైలోక్యజనయిత్రి, చలిగొండశాచూలి • వెలసియుండు
దక్షకుండమునఁ దీ • ర్థంబాడి యర్థితో, దాక్షాయణీదేవి • దక్షపుత్రి

తే. నసితపక్షాష్టమీతిథి • యందునొండె, మఱిచతుర్దశియం దొండె • మహితబుద్ధిఁ
జేసిదండప్రణామంబు • సేయునరుఁడు, కాంచు మోక్షంబుఁ బ్రాణని • ర్గతమునందు.

వ. ఆయుత్తరంబున వీరభద్రప్రతిష్ఠితంబు చెంగట నిబుతిలింగంబు భీమనాథేశ్వరు
నికిఁ బడమట వరుణప్రతిష్ఠితం బగు వరుణలింగంబు వరుణకుండంబునఁ దీర్థం
బాడి వరుణనక్షత్రంబున వరుణేశ్వరదేవుని దర్శించిననరుండు భవబంధనంబులం

బాయును; భీమేశ్వరు వాయవ్యదిగ్భాగంబున వాయుప్రతిష్ఠితం బగు వాయులింగంబుండు వాయుకుండంబునఁదీర్థంబాడి వాయులింగంబును సందర్శించిన నరుండు మోక్షలక్ష్మింగూడు; సోమేశ్వరలింగంబు సోమప్రతిష్ఠితంబు, సోమనక్షత్రంబున సోమకుండంబునఁ దీర్థంబాడి సోమేశ్వరదేవుని దర్శించిన నరుండు భుక్తిముక్తిసంసిద్ధిం బొందు. ౮౮

తే. బాదరాయణుఁడత్యంత ♦ పరమనిష్ఠ, సప్తసింధుసమీపదే♦శంబునందుఁ
దపముఁగావించి శంభుసం♦స్థాపనంబుఁ, జేసెనత్యంతభక్తివి♦శేష మమర. ౮౯

కం. పంచాక్షరమంత్రమును జ, పించుచు సత్యవతిసుతుఁడు ♦ పెద్దయుఁగాలం
బంచిత యోగసమాధి భ, జించెఁ దా సంప్రతిష్ఠ ♦ సేసినశంభున్. ౯౦

వ. ఒక్కనాఁ డమ్మహాదేవుండు త్రిగుణమూర్తులగుబ్రహ్మవిష్ణుమహేశానులచే సముపాస్యుండగుచు బాదరాయణునకుఁ బ్రత్యక్షం బగుటయు. ౯౧

మ. కురిసెం బువ్వులవాన మత్తమధులి♦ట్కోలాహలాన్వీతమై
విరిసెం దిక్కులు మందమందగతులన్ ♦ వీచె న్నభస్వంతుఁడున్
మొరసెం దుందుభు లొక్కయుమ్మడి నభో♦మూర్ధానకాశంబునం
బొరసెన్ సమ్మద మెల్లలోకముల క♦ప్పుణ్యావహాకాలంబునన్. ౯౨

కం. ఆడిరి యచ్చరలేమలు, పాడిరి గంధర్వపతులు ♦ పరమమునీంద్రుల్
గూడిరి బహువిధంబులఁ గొని, యాడిరి యందంద నద్భు♦తావహభంగిన్. ౯౩

కం. కొందఱు తాండవమాడిరి, కొందఱు పరిహాసకేళిఁ♦గొఱలిరి మఱియుం
గొందఱుబాహాయుద్ధం, బందంద ఘటం చిరమ్మ♦హాసంఘమునన్. ౯౪

వ. వ్యాసర్షికనుగ్రహం బొసఁగి యప్పరమేశ్వరుండు కూడినయశేషమునులను సర్వయోగీశ్వరులను సకలదేవతలనుద్దేశించి యిట్లని యానతిచ్చె. ౯౫

కం. ఈ యున్నవారలందఱు, నాయానతి వినుఁడు నెమ్మ♦నంబులలోనం
బాయం బెట్టుఁడుసంశయ, మీయర్థము వేదములకు ♦ నెక్కుడుసుండీ. ౯౬

తే. అర్కుఁ డెబ్భంగి నభమున♦కాభరణము, భువనములకెల్ల నాభంగి♦భూషణంబు
దక్షవాటీపురము భోగ♦మోక్షవిభవ, పావనంబందువిశ్వాస♦పరులుగండ్రు. ౯౭

కం. త్రిభువనములయందును మా, కభిమతములు పెక్కులైన ♦ నారామము లం
దభిమానమింతసేయము, విభవాస్పద మైనదక్షు ♦ వీటింబోలెన్. ౯౮

తే. వినుఁడు సత్యంబుసత్యంబు ♦ వెండిసత్య, మాత్మలోనవిచారించి ♦ యానతిత్తు
దక్షవాటంబుకంటెఁ దీ♦ర్థంబునిఖిల, మేదినీమండలంబున ♦ లేదు లేదు. ౯౯

గీ. వాఁడిగోర్గొండిఁ గన్నులు ♦ దోఁడిమైన, నడుగు లడిదంబు చేతఁజ♦క్కడచిమైన
నొండుకడ కేగుటలుమాని♦యుండవలయు, దక్కమాటలుదక్షవా♦టంబునందు.

కం. తిష్ఠస్నాత్రునకైన వ, సిష్ఠప్రతిమానుఁడైన ♦ శిష్టునకైనన్
నిష్ఠాత్మగలిగెనేనియు, నిష్ఠాకాలంబుముక్తి ♦ నియతం బచటన్. ౧౦౧

ఆ. బ్రహ్మహత్యమద్య♦పానంబు గురుతల్ప, గమనమాదిగాఁగఁ ♦ గలుగునట్టి
పాతకంబులపుడె♦పాయు మానవులకు, దక్షవాటిభీమ ♦ దర్శనమున. ౧౦౨

వ. అని యిట్లర్ధేందుమౌళి యానతిచ్చి యంతర్ధానంబుచేసెఁ తదనంతరం బాహరి విరించి పురందరాదులగు బృందారకులును సనకసనందనసనత్కుమారసనత్సుజాతులగుబ్రహ్మయోగీశ్వరులును, మార్కండేయ మందపాల మౌద్గల్య మాండవ్య మంకణాదులగుమహామునులును, బాదరాయణు నభినందించుచు, నిజస్థానంబులకుం జనిరి. ౧౦౩

సీ. సప్తగోదావర♦స్నానంబు రామనా,థావలోకనము పి♦త్రార్చనంబు
రామగయాపితృ♦శ్రాద్ధంబు గౌరీజ, నార్దనరుద్రస ♦ న్నామజపము
పరఁగమహాదివ్య♦భావనానార్చనా, భవనప్రదక్షిణ ♦ ప్రక్రమంబు
పంచాక్షరీమంత్ర♦పారాయణజపంబు, పాశుపతాచార ♦ పరమనియతి

తే. సమయమిదిసర్వదేవతా ♦ సార్వభౌము, భుక్తిముక్తిప్రదాయకు ♦ భువనభర్త
భీమనాథేశ్వరేశ్వరు ♦ స్వామిఁగొలుచు, భక్తులకునెల్ల నాగమ♦పద్ధతియిది. ౧౦౪

మ. పరదారేశ్వరకుంభసంభవవిభుల్ ♦ ప్రాగ్దిగ్విభాగంబులం
బురవిధ్వంసికి దూరదేశమునఁదా♦భోగంబునన్ శశ్వదా
వరణద్వారమునన్ మహామహిమచే ♦ వాయువ్యదిక్సీమ ను
ద్ధరతన్ వాయుశివుండునుండ్రుమిగులం ♦ దాత్పర్యశ్రద్ధాగతిన్. ౧౦౫

సీ. దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యమరులేస్థానంబు♦నందు లేరు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యర్థమేస్థానంబు♦నందు లేదు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యమృతమేస్థానంబు♦నందు లేదు
దక్షవాటీమహా♦స్థానంబులో లేని, యజ్ఞమేస్థానంబు♦నందు లేదు

తే. దక్షవాటిక సకలతీ♦ర్థముల కిరవు, దక్షవాటిక సకలవి♦ద్యలకుగరిడి
దక్షవాటిక విభవంబు ♦ తానకంబు, దక్షవాటిక శివునియం♦తఃపురంబు

వ. ఇట్టిమహామహిమంబుగలదక్షారామంబున నభివసింపుదము, భీమమండలంబు దర్శింపుదము, సప్తగోదావరమ్మునవాడుదము, వృద్ధగంగాజలంబులఁ దేలుదము తుల్యభాగాతోయంబుల మునుఁగుదుము, కణ్వవాహిని నవగాహింతము, కౌంతేయంబున నోలలాడుదము, లవణపయోనిధి గంగాసంగమంబులం నభిషేకింతము, రండని హర్షోత్కర్షంబున రోమహర్షణతనయుండు సూతాహ్వసంభవుండు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుం డైన సూతుండు పల్కినవిని నైమిశారణ్యపుణ్యా

క్షేత్రంబున ద్వాదశవార్షికపరిమితం బైన సత్త్రయాగంబునఁ గూడినశౌనకాది
మహామునులు, యజ్ఞావసానసమయంబున శ్రీమన్మహాదేవుని సందర్శింపం జనిరి.
ఇది పంచాశత్ఖండమండితంబును, సనత్కుమారసంహితాది బహుసంహితాసం
ధానంబును నైనస్కాందపురాణంబునందు గోదావరీఖండంబునందుఁ జెప్పంబడిన
భీమఖండంబు, భీమేశ్వరమాహాత్మ్యంబును, భీమేశ్వరపురాణం బనంబరఁగు నిమ్మ
హాప్రబంధంబు వ్రాసినఁ, బఠించిన, వినినఁ, బుస్తకం బర్చనచేసిన, నారాధిం
చిన, శ్రీభీమనాథేశ్వరుం డాయురారోగ్యైశ్వర్యంబులు, శాశ్వతమోక్షపదం ౧౦౭
బును గృపసేయు.

ఉ. వైభవపాకశాసన! సుపర్వ మహీధర ధైర్యవర్తి! గే
హాభయవంశదీపక! సముద్ధతవీరవిరోధిమండల
క్షోభకరప్రతాప! ఫణికుండలభక్తినిధీ! దిగంతగం
ధేభకటద్వయద్వయసహృద్యయశఃపరిదంబు నిర్జరా. ౧౦౮

కం. రామాంబానందన! సం, గ్రామజితధనంజయా! పరాక్రమరామా
స్వామిద్రోహరగండ! మ, హామాత్యకిరీటశేఖరామాత్యమణీ. ౧౦౯

భుజంగప్రయాతము. ప్రధూతార్యసామంత రక్షాధురీణా
విధూత్తంససేవాప్రవృత్తాంతరంగా
మధూళీమదాసార మాధుర్యవాక్యా
బుధారాధనాసార భోజావతారా. ౧౧౦

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజనవిధేయ
సకల విద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైన శ్రీభీమేశ్వరపురాణంబను
మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

శ్రీమాణిక్యాంబాసమేత శ్రీ భీమేశ్వరార్పణమస్తు.

శ్రీరామార్పణమస్తు.

శ్రీరామ.

# శ్రీ భక్తి సంజీవని.

ఇది శ్రీమదొంటిమిట్ట కోదండరామ సేవక సమాజమువారి
కైంకర్య రూప మాసపత్రిక.

దీనికి సర్వస్వామి శ్రీమదొంటిమిట్ట కోదండరామమూర్తి.

లేఖకుఁడు:—ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బరావు (వాసుదాసుఁడు)

ప్రకటనస్థలము:—వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట, కడప మండలము.

పత్రికా భారనిర్వాహకులు:—శ్రీ కోదండరామ సేవక సమాజసభ్యులు. ఆంధ్రదేశంబున మూర్ఛావస్థఁ జెందియున్న భక్తిమాతను స్వస్థావస్థకుఁ దెచ్చుటయే యుద్దేశము. భక్తిమార్గమున నడచి యుభయలోకముల బాగుపడఁ గోరువారికి ముఖ్యముగ శ్రీకోదండరామ సేవక సమాజ సభ్యులకుఁ దెలియఁదగిన భక్త్యంగము లైన కర్మ, జ్ఞాన, యోగముల గుఱించియు భక్తిలక్షణము దాని యనుష్ఠానము గుఱించియుఁ బ్రపత్తిగుఱించియు వ్యాసములు, గ్రంథములు, ప్రధానోప సమాజముల వృత్తాంతములు తద్విషయమైన లోకవార్తలు నిందుఁ బ్రకటింపఁబడుచుండును.

## చందాల వివరము.

| | | | | |
|---|---|---|---|---|
| ఉపచారకులు | సంవత్సరమునకు | ౨ | ౦ | ౦ |
| ధారకులు | ,, | ౫ | ౦ | ౦ |
| జీవాతువులు | ,, | ౧౦ | ౦ | ౦ |
| పోషకులు | ,, | ౨౫ | ౦ | ౦ |
| రక్షకులు | ,, | ౫౦ | ౦ | ౦ |
| ఉజ్జీవకులు | ,, | ౧౦౦ | ౦ | ౦ |

అంతకుఁ బైపడి యిచ్చువారు ప్రతిష్ఠాపకులు. సంవత్సరము చందాకుఁ దక్కువ గ్రహింపఁబడదు.